పోతిక కలవి. కాని వానికంటెను విలక్షణ మగునవి.

ఉదాహరణమునకు :-

> " ఏవంవాదిని దేవర్షౌ పార్శ్వే పితు రధోముఖీ
> లీలాకమలపత్రాణి గణయామాస పార్వతీ" (కుమారసంభవము - 6.84)

ఇచట ఈశ్లోకమునందలి ఆ యా పదములకు గల అభిధాలక్షణాశక్తులచే ప్రతిపాద్యములగు అర్థములకంటె అతీతమై మరొక యర్థము గోచరించుచున్నది.

అది ఇట్లు :

దేవర్షియగు అంగీరసుడు హిమవంతునితో పార్వతిని శివున కిచ్చి పెండ్లిచేయు విషయమై ఈ (పై) విధముగ పలుకునప్పుడు తండ్రిపార్శ్వమున పార్వతి యధోముఖియై (నిలిచియుండి) లీలాకమలపత్రములను లెక్కించెను. హేతువేమై యుండును? అని ప్రశ్న. ఆమె కన్య; ముగ్ధ. కాని ప్రియవిషయకాలాపశ్రవణముచే ఆమెమనమున లజ్జ కలిగినది. దానివలన తనలో నేమి సాత్త్వికభావములు ప్రకటములగునో - అవి పెద్దల మనస్సున కేమనిపించునో; వానిని గోపనము చేసికొనవలెను. అందులకై తాను వ్యాపారాంతర ప్రవృత్తురాలగుట యావశ్యకము. అదియే ఈలీలాకమలపత్రగణనమునకు హేతువు. ఈవిషయమును వెనుక వెనుకకు యోజించుచు పోయినప్పుడు పార్వతీచి త్తజనితలజ్జానామక సంచారిభావము ఈశ్లోకముచే ప్రతిపాద్యమగు ముఖ్యార్థము. ఏలయన అదియే యిచ్చట సహృదయచిత్త చమత్కృతిజనకము. కవిచే సాక్షాత్తుగా చెప్పబడనిది. పరోక్షముగా చెప్పబడినది. "పరోక్షప్రియా ఇవ హి దేవాః" ఇట్టి పరోక్షికోక్తులచే దేవతలు ప్రీతి నొందుదురట. ఇచట సహృదయులే ఆదేవతలు. లజ్జాఖ్య సంచారి భావము రసాంగము. కనుక ఇచటి ఈయుదాహరణము రసధ్వనికి సంబంధించినది.

> "గురుగుం జెంచలిఁ దుమ్మి లేఁదగిరి సాకుం దింత్రిణీ పల్లవో
> త్కరముం గూడఁ బొరంటినూనియలతోఁ గట్టావికుట్టారుగో
> గిరముల్మెక్కి, తమిం బసుల్పొలమువోఁ గ్రేపుల్మెయిన్నాక మే
> కెరువుంగుంపటి మంచమెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్."
>
> ( ఆముక్తమాల్యద - 4.131. )

అను పద్యమున రెడ్లదానిద్ర్యమును వస్తువు - క్రేపులు రెడ్లను తమ తల్లులుగా తలచిన భ్రాంతిమదలంకారము దాని మూలమున స్ఫురించు హాస్యరసము అనునవి ధ్వనులు.

ఇప్పుడు మరల పైవిషయముల నాలోచించవచ్చును. వైయాకరణుల స్ఫోటసిద్ధాంతమున శబ్దాత్మకధ్వని -- స్ఫోటము -- శబ్దప్రతిపాద్యార్థ ప్రతీతి

ధ్వనిసంప్రదాయవాదులగు అలంకారికుల మతమున

వ్యంకజమగు వాక్యము<br>
లేదా<br>
పదము<br>
లేదా<br>
పదాంశము --వ్యంజనావ్యాపారము -- వ్యంఙ్యార్థ ప్రతీతి

ఈవిధముగా స్ఫోట - ధ్వని సిద్ధాంతములకు సామ్యము కుదురుచున్నది.

ఈధ్వనిసిద్ధాంతమును శ్రీమన్మహాభారతమున కన్వయించుటయే ఈనిబంధమున ప్రతిపాద్యవిషయము. ఇట్టి విషయమునందు ప్రవేశించుటకే ఎంతయో యోగ్యత కావలయును. గురుకులసమాశ్రయణమున సంపాదించిన సంప్రదాయ పరిజ్ఞానము - తత్త్వజ్ఞాననిష్ఠ- దృఢపరిశ్రమము- అనహంకారతాపూర్వకమైన సహృదయత్వము - లేనిదే ఇట్టి విషయములందు నిష్కృష్టమైన పాండితి యలవడదు. దానిని నిర్దుష్టముగను, స్పష్టముగను, సరళముగను ప్రతిపాదించు సామర్థ్యమును అబ్బదు. శ్రీశర్మగారికి ఈపై సాధనసామగ్రి యంతయు సమగ్రమునగలదు. శ్రీవేమూరి రామబ్రహ్మశాస్త్రులవారు ఆంధ్రదేశమునందు జన్మించి, భారతదేశమునందలి సుప్రసిద్ధ విద్వద్వరేణ్యుల కెవ్వరికిని తీసిపోని కూలంకష పాండితి కలిగియుండియు - మారుమూల నెచ్చటనో - ఆగిరిపల్లిలో చాల కాలమును చివర చివర ఒంగోలులో కొంతకాలమును శాస్త్రపాఠప్రవచనములతో కాలముగడిపిన మహానుభావులు. వారికి రాని శాస్త్రములేదు. అసమగ్రత యనునది వారి పాండితిలో నెచ్చటను కానరాదు. వేదభాష్యములు - మీమాంసాశాస్త్రమున అర్థసంగ్రహము మొదలు శాబరభాష్య - శ్లోక - తంత్ర - వార్తికముల వరకు అన్ని గ్రంథములును వ్యాకరణశాస్త్రమున మంజూషాభూషణసారాదికము - అలంకారశాస్త్రమున అన్ని గ్రంథములును - వేదాంతశాస్త్రమున అద్వైతపరిభాష మొదలు ఖండన ఖండఖాద్యము వరకు నన్నియును తర్కశాస్త్రమున నన్నిగ్రంథములును నిరాఘాటముగ ననేకావృత్తులు పాఠములు ప్రవచించి పండిన పాండితి కల వారిని గూర్చి ఏదో చెప్పబూనుట సాహసము, వారి శిష్యకోటిలో కడపటివారు శ్రీరామచంద్రుల కోటీశ్వరశర్మగారు న్యాయ వేదాంతాద్యనేకశాస్త్ర పారంగతులు. వారినుండి సంపాదించిన సంప్రదాయబద్ధ మగు శాస్త్రీయాలోచనా సరణి శ్రీశర్మగారిది. ఇట్టి వీరిచే సంగ్రథింపబడిన ఈనిబంధము మూలమున ధ్వన్యా చార్యుని ధ్వన్యాలోకమును శ్రీమన్మహాభారతమువంటి ఆర్షగ్రంథముపై నన్వయించుటలోను - దాని నొక సరసకావ్యవముగా భావనచేసి ఆనందించుటలోను - సహృదయులకు తోడుపడుట అను

రెండు ప్రయోజనములు చక్కగా నెరవేరగలవు. ఈబృహత్ప్రయోజనమును సిద్ధింపజేయుటలో ఇది నిష్కృష్టముగ నుపయోగించు సాధనమగుటచే నిదియంతయుగాని. దీని యందలి ప్రత్యేకవ్యాసములేకాని ప్రత్యేకము సమగ్ర గ్రంథముగా పఠన - పాఠనములలో గ్రహింపబడినచో భారతీయాలంకారికభావనాసరణిసంప్రదాయ మవిచ్ఛిన్నముగ ఆంధ్రదేశమున ముందునకు సాగిపోవుచుండునని నిశ్చయముగ చెప్పవచ్చును. ఇందతిశయోక్తి లేశమాత్రమును లేదు.

ధ్వన్యాలోకమునకు వివరణములో - అనువాదములో - ఇతఃపూర్వము పెద్ద లెందరో రచించినవి కలవు. కాని ఈనిబంధరచయిత ధ్వన్యాలోకమును చూచిన తీరు - అన్వయించుకొనిన విధము - తనది. దీనిని వినియోగించుకొన గలుగుట ఆంధ్రసాహితీతత్త్వజిజ్ఞాసువులగు సహృదయులవంతు.

ఆదోని

పాతూరి సీతారామాంజనేయులు

ది 26-9-1979